భాసురలీలఁ జూచి నవపద్మదళాక్షునకున్ వినమ్రులై. 591

క. తమపలికినభాషణములు, కమలోదరు[1]వాక్యసరణిఁగాఁ దలఁచుచు నె
య్యమునన్ వైష్ణవలక్ష్మిం, బ్రమదంబునఁ బ్రస్తుతించి పరమేశ్వరుచేన్. 592

క. ఆమంత్రితులై తగ నిజధాములకుఁ జనిరి వారు దడయక లక్ష్మీ
రాముఁడు జయవిజయుల నభిరామంబుగఁ జూచి పలికె రయ మొప్పారన్.

క. మీ రసురయోనియం దని, వారితులై జనన మంద వలసెను నే దు
ర్వారబలాఢ్యుఁడ నయ్యును, వారింపఁగ నోప విప్రవచనము లెందున్. 594

క. అది గాన దనుజయోనిం, బదపడి జనియించి మద్విపక్షులరై మీ
మది నెపుడు నన్ను తలఁచుచు, వదలక నాచేతఁ జచ్చి వచ్చెద రిటకున్. 595

ఉ. పొం డని యానతిచ్చి హరి ఫుల్లసరోరుహపత్త్రనేత్రుఁ డా
ఖండలముఖ్యదిగ్వరనికాయకిరీటలసన్మణిప్రభా
మండితపాదపీఠుఁడు రమారమణీమణి దోడ నేఁగు దే
నిండినవేడ్క నేఁగె నిజనిర్మలమందిర పుణ్యభూమికిన్. 596

వ. అంత. 597

క. నిజతేజోహాని గ జయ,విజయులు ధరఁ గూలి రపుడు విహ్వలు లగుచుం
ద్రిజగముల సురవిమాన,వ్రజముల హాహారవంబు గ్రందుగఁ జెలఁగన్. 598

క. వారలువో దితిగర్భా,గారంబున నున్నవారు గడఁగి తదీయో
దారఘన తేజ మిప్పు డని, వారణ మీ తేజ మెల్ల వమ్ముగఁ జేసెన్. 599

ఉ. ఇంతకు మూల మాహరి రమేశ్వరుఁ డర్థి నొనర్చు కార్యముల్
వింతలె సర్వభూతభవవృద్ధివినాశనహేతుభూతుఁ డా
ద్యంతవికారశూన్యుఁడు దయానిధి మీ యెడ మేలు సేయు నీ
చింత దొఱంగి వేచనుఁడు చేకుఱు మీఁద మనోరథార్థముల్. 600

క. అని వనజాసనుఁ డాడిన, విని తద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం
బున కేఁగిరి దితి నిజనా,థునిమాటలు దలఁచి యపరితోషముతోడన్. 601

— జయవిజయులు దితియందు హిరణ్యాక్షహిరణ్యకశిపులై పుట్టుట. —

తే. ఇంతి తనసుతుల్ సురలఁ గారింతు రనుచుఁ, దలఁచుచుండంగ నంత వత్సరశతంబు
సనఁగ నటమీఁద గనియెఁ గశ్యపునిదేవి, యఖిలలోకైకకంటకులైన సుతుల.

వ. అయ్యవసరంబున. 603

తే. ధరణి గంపించెఁ గులపర్వతములు వడఁకె
జలధులు గలంగెఁ దారకావళులు డుల్లె
గగన మగలెను మ్రొగ్గె దిక్కరులు దిశల
మిడుఁగుఱు చెదరెఁ బిడుగులు పుడమిఁ దొరఁగె. 604

1. 'భాషణములు' అ. ప్ర.

సీ. హోమానలంబుల ధూమంబు లడరెను, బ్రతికూలవాయువుల్ ప్రబలి వీచెఁ
దరువు లెల్లెడ విద్యుత్పాతంబులై కూలె, గ్రహతారకావళికాంతి మాసె
బెరసి యుల్కలు నక్షత్రపథాన గురిసెను, మెఱుఁగులు దెసల మిక్కుటిల్లి గోలిపె
స్వర్భానుఁ డొగి సహస్రాంశుని ఘనముగఁ బట్టెఁ, గైకొని చిమ్మచీఁకట్లు పర్వె
తే. మొనసి కుక్కలు మొఱఁగె నామోర లెత్తి, పగలు నక్కలు వాపోయె ఖగము లార్త
రవము లిచ్చెను దేవతాప్రతిమ లొరగెఁ, గన్నులను నశ్రుకణములు గ్రమ్ముకొనఁగ.
క. మొదవులు నెత్తురుఁ జేపెను, బిదికెన్ గార్దభరవంబు భీషణ మయ్యెన్
మద ముడిగెఁ గరులకటములఁ, బొదివెఁ దురంగములవాలధుల నిప్పు లొగిన్.
క. గుహలు రొద లిచ్చెఁ బాపగ్రహమిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్య
గ్రహములు వర్తించెను దుస్సహతేజో దితితనూజసంభవవేళన్. 607
మ. భయదప్రక్రియ నిట్లు దోఁచినమహోత్పాతంబు లీక్షించి సం
శయకాలం బిది కాని సాధుజనవర్గక్రూరజీవాహితో
దయసంక్షోభము గా నెఱుంగక సమస్తప్రాణిజాతంబు ను
ద్భయ మందెన్ సనకాదియోగిజనముల్ దక్కన్ బుధేంద్రోత్తమా. 608
వ. అట్లావిర్భవించిన యనంతరంబ. 609
మ. కులశైలాభశరీరముల్ దనర రక్షోనాథు లత్యుగ్రదో
ర్బల మొప్పం బదఘట్టనన్ ధర చలింపన్ రత్నకేయూరకుం
డలకాంచీకటకాంగుళీయకకిరీటస్వర్ణమంజీరని
ర్మలకాంతుల్ దులకింప నాత్మరుచిచే నుద్దీకృతార్కాంశులై. 610
వ. ఉన్నసమయంబున గశ్యపుండు నిజతనూభవులఁ జూడం దలంచి దితిమందిరంబు
నకుఁ జనుదెంచి సుతులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి.
చ. దితిజఠరంబునందుఁ దనతేజము మున్నిడినట్టిపుత్త్రు న
ద్భుతచరితున్ హిరణ్యకశిపుం డను పేరుఁ బ్రసూతివేళ నా
దితి మును గన్నపట్టి రవితేజునిఁ గాంచనలోచనుండు నా
హితమతిఁ బేరుఁ బెట్టి చనియెన్ నిజనిర్మలపుణ్యభూమికిన్. 612
వ. అయ్యవసరంబున నతులతేజోవిరాజితుం డైన హిరణ్యకశిపుండు హిరణ్యగర్భవర
దానగర్వంబునను దుర్వారపరిపంథిగర్వనిర్వాపణాఖర్వభుజావిజృంభణంబునను
నిఖిలలోకపాలాదుల జయించి (స్వవశం బొనర్చి) సంతుష్టాంతరంగుం డై
యొదునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖం బుండెఁ దత్సోదరుం
డైన హిరణ్యాక్షుండు ప్రతివాసరంబుఁ జండవేదండశుండాదండమండితభుజాదం
డంబున గదాదండంబు ధరియించి తన్ను నెదిరి కదనంబు సేయంజాలిన యరివీ
రునిం గానక భూలోకం బెల్లఁ గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమర
విముఖు లయిన బర్హిర్ముఖులం గనుంగొని వనజాసనవరప్రదానంబుఁ జింతించి

ఘనగదఁ గేలఁ బూని దితి । గర్భజుఁ డాకృతిఁ దాల్చి వ్రేల్మిడిం
జనియె రసాతలంబునకుఁ । జండభుజాబలదర్ప మేర్పడన్. 632

వ. చని జలమధ్యంబున. 633

క. దివిజారి యెదురఁ గాంచెను, నవిరళదంష్ట్రాభిరాము । నమరలలాముం
గువలయభరణోద్దాముఁ, నవనమయ స్తబ్ధరోము । జలదశ్యామున్. 634

వ. ఆ య్యవసరంబున సూకరాకారుం డైన హరియు. 635

క. వనజరుచిసన్నిభము లగు, తనలోచనయుగళదీప్తిఁ । దనరఁ దదాలో
కనముల దనుజాధీశుని, తనుకాంతి హరింపఁ జేసెఁ । దత్క్షణమాత్రన్. 636

వ. మఱియు నయ్యాదివరాహం బవార్యశౌర్యంబున మాఱు లేనివిహారంబునం
జరియించునట్టియెడ. 637

సీ. తుదమొదళ్లకుఁ జిక్కఁ । దునిసిపాఱఁగ మోరఁ, గులశైలములఁ జిమ్ముఁ । గొంతదడవు
బ్రహ్మాండభాండంబు । పగిలి చిల్లులువోవఁ, గొమ్ములఁ దాటించుఁ । గొంతదడవు
జలధు లేడును బంక । సంకులంబై యింకఁ, ఖురముల మట్టాడుఁ । గొంతదడవు
నుడురాజుసూర్యుఁడు । నొక్కమూలకుఁ బోవఁ, గుఱుచవాలము ద్రిప్పుఁ । గొంతద
[డవు

తే. గునియుఁ గుప్పించు లంఘించుఁ । గొప్పరించు
నెగయు ధరఁ ద్రవ్వ బొఱియఁగా । నేపు మిగిలి
దానవేంద్రునిగుండెలు । దల్లడిల్లఁ
బంది మెల్లన రణపరి । స్పంది యగుచు. 638

వ. మఱియును. 639

క. కనుఁగవ నిప్పులు రాలఁగ, సునిశితదంష్ట్రాగ్రయుతవ । సుంధరుఁ డగుచుం
దన కెదు రేతేరఁగ నీ, వనచర మేరీతి నిపుడు । వనచర మయ్యెన్. 640

క. అని యశ్చర్యభయంబులు, దనమనమునఁ దొంగలింపఁ । దనుజాధిపుఁ డి
ట్లనియెన్ భీకరసూకర, తను వొంది చరించుదనుజ । దర్పాపహుతోన్. 641

క. ఘనసూకర మూర్త్యాత్మక, వనరుహసంభూతదత్త । వరదానమునం
గనినరసాతలగతభువి, యనయంబును నాయధీన । మై వర్తించున్. 642

క. గొనకొని నీ వీధరణిం, గొని పోకుము విడుము కాక । కొని యేఁగెద వే
గొనియెద నీప్రాణముఁ గై,కొను నావచనములు సలము । కొన నేమిటికిన్. 643

క. మాయావి వగుచు నిప్పుడు, వాయక యీపుడమిఁ జోర । భావంబున [1]నీ
వీయెడఁ గొని పోఁ జూతువె, యాయత భుజబలముచేత । నడఁపక యనుచున్.

సీ. అవిరళయోగమా । యాబలంబునఁ జేసి, యల్పపౌరుషమున । నలరునిన్ను
వర్థి సంస్థాపించి । యస్మత్సుహృద్భృత్య,కులుల కెల్లను మోద । ములయఁ జేయఁ
జెలు వేది మద్గదా । శీర్ణుఁడ వగునిన్నుఁ, గనుఁగొని దేవతా । గణము లెల్ల

1. గొంపోయెద నా శత్రుపులక్, ద్రయత విత్రండపాలెఁ జంపు కేళ్ళన్. త్రా. ప్ర.

నిర్మూలులై చాల నెఱి నశించెద రన్న, విని యజ్ఞపోత్రి యై వెలయుచున్న

తే. హరి సరోజాతభవముఖామరుల కెల్ల, వచ్చె దురవస్థ కాత్మలో నంత నొంది
నిశితదంష్ట్రాగ్ర[1]లసిత యై నెగడుధరణి, దేవితో నొప్పె నాదేవదేవుఁ డంత.

క. [2]సురరిపువాక్యాంకుశముల, గురుకుపితస్వాంతుఁ డగుచుఁ గోమరారి వసుం
ధరతో క్షితి నొందిన, కరిణిం గలకరికులేంద్రు కరణిం జెలుచన్. 646

తే. నిశితసితదంష్ట్రరోచులు నింగిఁ బర్వఁ, గంధి వెడలి భయంకరాకారలీల
నరుగుక్షపణామఖవరాహావతార, మొనరఁ దాల్చినపద్మలోచను నివెనుక. 647

క. కరిసనుకఁ దగులు నక్రము, కరణిం జని దైత్యవిభుఁడు గదిసి యిటు లనున్
ధరితపయోనిధితరికిం, గిరికిన్ ఖురదళితమేరుగిరికిన్ హరికిన్. 648

క. నిందకు రోయక లజ్జం, జెందక వంచనను రణము సేసి జయంబుం
బొందెద నని [3]తలఁచుచు నిటు, పందగతిం బాఱె బంటుపంతమె నీకున్. 649

వ. అని యాక్షేపించినం బుండరీకాక్షుండు కోపోద్దీపితమానసుం డై. 650

క. తోయములమీఁద భూమి న, నాయాసత నిల్పి దాని కాధారముగాఁ
దోయజనాభుఁడు దనబల. మాయతమతిఁ బెట్టె సురలు హర్షము నొందన్.

తే. కుసుమములవృష్టి బోరనఁ గురిసె నంత
విభవ మొప్పార దేవదుందుభులు మొరసెఁ
గడఁక వీతెంచె గంధర్వగానరవము
నందితము లయ్యె నప్సరోనర్తనములు. 652

వ. అయ్యవసరంబున నయ్యజ్ఞవరాహమూర్తిధరుం డైన కమలలోచనుండు గనక కుండల కేయూర గ్రైవేయ కటకాంగుళీయక భూషణరోచులు నింగిఁ బర్వ సమర సన్నద్ధుం డై. 653

చ. ఘనగదఁ గేలఁ బూని మణికాంచనసవ్యవిచిత్రవర్మ మిం
పొనరఁగఁ దాల్చి దానవనియుక్తదురుక్తినిశాతబాణముల్
దనఘనమర్మముల్ గలఁప దానవహంత నితాంతశౌర్యుఁ డై
కనలుచు వచ్చునద్దనుజుఁ గన్గొని రోషవిభీషణాకృతిన్. 654

వ. ఇట్లనియె. 655

మ. వినరా హారి యమంగళాచరణ యుద్యద్వృత్తిన్ నను న్నీమది
న్ననయంబున్ వనగోచరం బగు మృగం బంచుం దలం తౌర నే
నెనయన్ వన్యమృగంబ యౌదు బలిమి న్నెంతెంచు నీజోటి యా
శునకశ్రేణి వధింతు నేఁ డని మొనం జోఁ గోర్చి వర్తించినన్. 656

క. బలిమి గలదేని నాతోఁ, గలనను నెదిరించి పోరఁ గడఁగుము నీకో

1. శోరకవసితధరణి. 2. వరజలయతజలచరగణసరటీజాకలశలోల భావమతోవం. ధరిశాంత్రితి నొందిన, కరణిం గల వ్రా, ప్ర. 3. మదిఁ దలఁచిటు

క్రాలు సేఁసు క్రీడ్ర నూరక, తలపోయ నిక్కానంబు దగదు దురాత్మా. 657

చ. కినుక మిడిగాక సంగరవివేకవిశారదు లైనయట్టిస
జ్జనములు మృత్యుపాశములఁ జాల నిబద్ధులు నయ్యు నీవలెన్
గొనకొని యాత్మసంస్తుతులఁ గూయుదు రందఱు రేల యీ విక
త్థనములు బంటుతనము లె దైత్యకులాధమ యెన్ని చూడఁగన్. 658

మ. ధృతిఁ బాతాళమునందు నీ వనెడిసందీప్తోగ్రనిక్షేప మే
గతిదర్పంబునఁ గొందుఁ జూడు మిదె దేవారాతి నన్నన్న దా
గతలజ్జం దన దాఁగి యుండి రణముం గావింతు యుష్మద్గదా
వితతద్రావితుఁ డన్న నన్నెదురుమా వే తీర్తు నీకోరికల్. 659

ఉ. ఎన్నఁ బదాతియూథముల కెల్ల విభుండవు పోటుబంటవై
నన్ను రణోర్విఁ నేఁ డెదిరినన్ భవదీయబలంబు నాయువున్
మిన్నక కొందుఁ జూడు మిది మేరఁగ మేదిని వీతదైత్యమై
వన్నెకు నెక్కఁ జేసెద సవార్యపరాక్రమవిక్రమంబునన్. 660

చ. నను నెదురంగఁ జాలినఘనం బగుశౌర్యము ధైర్యమున్ బలం
బును గలవేని నిల్వు రణభూమిని నీహితు లైనవారికిం
గనుఁగవ బాష్పపూరములు గ్రమ్మఁగ మాన్పఁగ నోపుదేనిఁ జ
య్యనఁ జనఁ బొమ్ము దానవకులాధమ యూరక రజ్జులేటికిన్. 661

క. నను నిట సంస్థాపించెద, నని పలికితి వంతవాఁడ వౌదువు నీకున్
నెన రైనచుట్టములఁ బొడ,గని రాఁబదె యమునిపురికిఁ గాఁపుర మరుగన్.

మ. అని యిబ్భంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి ప
ల్కిన హాసోక్తుల కుల్కి రోషమదసంగీభూతచేతస్కుఁ డై
కనుఁగ్రేవన్ మిడుఁగుర్లు సాలఁ బొడమంగాఁ గిన్కమైఁ దోఁకఁ ద్రొ
క్కినకృష్ణోరగరాజుమాడ్కి మదిలోఁ గీడ్పాటు వాటిల్లఁగన్. 663

క. చలితేంద్రియుఁ డై నిట్టూ,ర్పులు నిగిడించుచును బొమలు ముడివడ రోషా
కులమానసుఁ డై గదఁ గొని, జలజాక్షుని కెదురునడచె సాహస మొప్పన్.

వ. అత్తఱి హిరణ్యాక్షుం డతిభయంకరాకారుం డై. 665

మ. గద సారించి మదాసురేంద్రుఁడు సమగ్రక్రోధుఁ డై మాధవుం
గుదియన్ వ్రేసిన వ్రేటు గైకొనక రక్షోహంత శౌర్యోన్నతిన్
గద కేలన్ ధరియించి దానిఁ దునకల్ గావించినం దైత్యుఁ డు
న్మదుఁ డై యొండుగదన్ రమావిభుని భీమప్రక్రియన్ వేసినన్. 666

చ. అది దను దాఁకకుండ దనుజారి గదారణకోవిదక్రియా
స్పదకరలాఘవక్రమముఁ బైకొని చూపి విరోధివేరురం
బదయత వ్రేయ వాఁడు వివశాకులభావము నొంది యంతలో

మదిఁ దెలివొంది వ్రేసె రిపుమాననిమర్దను నాజనార్దనున్. 667

వ. ఇట్లు దలపడి యన్యోన్యజయకాంక్షల నితరేతరభంగతరంగతాడితంబు లగు దక్షిణోత్తరసముద్రంబులకైవడిం బరస్పరతుండాదండఘట్టిత మదాంధగంధ సింధురయుగంబు చందంబున రోషభీషణాటోపంబులం దలపడు దెబ్బ లుఱఁగబ్బన నతిదర్పాతిరేకంబున నెదిర్చి ఱంకెలు వైచు వృషభంబులవిధంబున నసహ్యసింహపరాక్రమంబున విక్రమించి పోరు నెడ హిరణ్యాక్షుండు సవ్యమండల భ్రమణంబునఁ బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణమండలభ్రమణంబునం దిరిగి విపక్షువక్షం బశనిసంకాశం బగుగదాదండంబునం బగిల్చిన వాఁడు దెప్పఱి తెలివొంది లేచి దనుజరిపుఫాలంబు నొప్పించె నప్పు డమ్మేటివీరులు శోణితసిక్తాంగు లై పుష్పితాశోకంబులం బురుడించుచుం బాయుచు డాయుచు వ్రేయుచు రోయుచు నొండొరులరుధిరంబు లాఘ్రాణించుచుఁ దిరస్కారపరిహాసోక్తు లిచ్చుచుఁ బోరుసమయంబున నమ్మహాబలుసమరంబుఁ జూచు వేడ్కఁ బద్మసంభవుండు నిఖిలమునీంద్రసిద్ధసాధ్యదేవగణంబులతోడఁ జనుదెంచి ధరిత్రీనిమిత్తంబున నసురవరునితోడం బోరుయజ్ఞవరాహున కిట్లనియె. 668

ఉ. అంచితదివ్యమూర్తి పరమాత్మక యీ కలుషాత్ముఁ డైన న
క్తంచరుఁ డస్మదీయవరగర్వమునన్ భువనంబు లెల్లఁ గా
రించు మదించి యిట్టివిపరీతచరిత్రునిఁ ద్రుంప కిట్లుపే
క్షించుట గాదు వీని బలిసేయు వసుంధరకున్ శుభం బగున్. 669

క. బాలుండు గరమున నుగ్రవ్యాళము ధరియించి యాడుసవువున రక్షః
పాలునిఁ ద్రుంపక యూరక, పాలార్చుట నీతియే శుభప్రద యుంకన్, 670

వ. అదియునుం గాక. 671

మ. అనఘా యీ యభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే
ననయంబున్ మఱి దైత్యవేళ యగుసంధ్యాకాల మేతెంచినన్
ఘనమాయాబలశాలి యైనదనుజుం ఖండింపఁగా రాదు గా
వున నీవేళన ద్రుంపు సజ్జనహితప్రోద్యోగరక్తుండ వై. 672

క. అని సరసిజగర్భుఁడు వల్కినవచనము లర్థి విని నిలింపులు గుంపుల్
గొని చూడ సస్మితాననవనజము నెలువొంద నసురవరు కభిముఖుఁ డై. 673

తే. పుండరీకాక్షుఁ డయ్యాదిభూరిపోత్రి, నిరతిఁ దరుణారుణాంభోజనేత్రుఁ డగుచు
ఘనగదాదండ మెత్తి రాక్షసునిహనువు, నుగ్రగతి మొత్తె వాఁడు నున్నోసరించె.

క. పరువడి దితిసుతుఁ డతిభీకరగదఁ జేఁ బూని చిత్రగతులను బద్మో
దరు డాసి చేతిగద సాగరమునఁ బడ నడిచె బాహుగర్వ మెలర్పన్. 675

వ. అంత. 676

తే. హరి నిరాయుధుఁ డైన సురారి సమర, ధర్మ మాత్మను దలఁచి యుద్ధంబుఁ దక్క

నిక్కి చూచుచు నుండెను నింగి యసుర, వరుల హాహారవంబుల భరిత మయ్యె.

క. సరసిజనేత్రుఁడు దనుజే, శ్వరుసంగరధర్మమునకు సముచితశౌర్య
స్ఫురణకుఁ దనచిత్తంబునఁ, గర మాశ్చర్యంబు నొందెఁ గడుఁ దలిర్పన్. 678

మ. కుతలోద్ధర్తమనంబునం దలఁచె రక్షోరాజ్యధ్వాంతంబుగా
దితిసంతానకులాటవీమహితసందీప్తప్రభాశుక్రముం
సతతోద్యజ్జయశబ్దసన్ముఖరభాస్వచ్ఛక్రముం సంతతా
శ్రితనిర్వక్రముఁ బాలితప్రకటధాత్రీచక్రముం జక్రమున్. 679

వ. అదియునుం బ్రచండమార్తాండమండలప్రభాపటలచటులవిద్యోతమానంబును బటువటజ్జ్వాలికాపాస్తసమస్తకుటిలారాతిబలాఖర్వదుర్వారబాహాగర్వాంధకారంబును నసహ్యాకహాకహానినదాధరీకృతసాగరఘోషంబును సకలదేవతాగణజేగీయమానంబును ననంతతేజోవిరాజితంబును నిజప్రభాపటలపూరితబ్రహ్మాండకటాహంబును నైరయంబునం జనుదెంచి దనుజారిదక్షిణకరసరోజంబు నలంకరించిన నాశుభాంగుండు రథాంగపాణి యై దివంబున నమరగణంబులు జయజయశబ్దంబులు వలుక నసురవిభున కెదురుగా నడచిన. 680

క. పొడగని దనుజుఁడు పెదవులు, దడుపుచుఁ బొలివోనిబంటుతనమున బీరం
బుడుగక భీషణగదఁ గొని, యడిచెం మఖమయవరాహు ననిమితోత్సాహున్.

క. త్రిదశారి దన్ను వ్రేసినఁ, గదఁ బదమునఁ బోవఁ దన్ని కమలాక్షుఁడు పెం
పొదవఁగ మనమున మోదము, గదురఁగ లేనగవు వదనకమలముఁ[1] బొదువన్.

వ. ఇవ్విధంబున గదఁ బోవం దన్ని యసురవిభునితో నిట్లనియె. 683

చ. ఘనగదఁ గేలఁ బూని భుజగర్వ మెలర్పఁగ నన్ను సంగరా
వని నెదిరించు రార యనివారణ దైత్యకులేశ్వరాధమా
యనవుడు వాడు [2]నుబ్బి గద నంబుజనాభుని వ్రేసె వ్రేసినం
దనుజవిభేది పట్టికొనెఁ దార్క్ష్యుఁ డహీంద్రునిఁ బట్టుకైవడిన్. 684

క. దితిజుఁడు దనబల మప్రతి, హతతేజుం డగు సరోరుహాక్షునిశౌర్యో
న్నతిమీఁదఁ బెట్ట కుండుట, మతి నెఱిఁగియుఁ బెనఁగె దురభిమానము పేర్మిన్.

వ. అంత. 686

సీ. కాలానలజ్వాలజ్జ్వాలావిలోలక, రాళమై పెంపొందుశూల మంది
సురవైరి యజ్ఞసూకరరూపధరుఁ డైన, వనజనాభునిమీఁద వైవ నదియు
సద్ద్విజోత్తముమీఁదఁ జపలత గావించు, నభిచారకర్మంబునట్ల బెండు
పడి పఱతేఁ గని పద్మోదరుఁడు దానిఁ, జక్రధారాహతిఁ జండవిక్ర

తే. మమున నడుమన వడిఁ ద్రుంచె నమరభర్త, మహితదంభోళిచే గరుత్మంతుపత్త్ర
మతిరయంబునఁ ద్రుంచినగతిఁ జెలంగి, సురలు మోదింప నసురులు సొంపుడింప.

---

1. మ్రోవన్. 2 నవ్వి.

వ. అయ్యవసరంబున నయ్యసుర దనశూలంబు చక్రంబుచేత నిహతం బగుటం గని.

క. దితిజుఁడు రోషోద్ధతుఁడై, యతినిష్ఠురముష్టిఁ బొడిచె హరి వాలోకో
న్నతుఁ డొప్పెఁ గుసుమమాలాహతి దిగ్గజరాజుఁబోలె నతిదర్పితుఁడై. 689

మ. హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్
ధరణీచక్రము ధూళిపాంసుపటలధ్వాంతంబునం గప్పె భీ
కరపాషాణపురీషమూత్రఘనదుర్గంధాస్రరక్తావళుల్
గురిసెన్ మేఘము లభ్రవీథిని మహోగ్రక్ష్వేళక్రియాలోలమై. 690

వ. మఱియును. 691

చ. తవిలి విముక్తకేశపరిధానము లుగ్రకరాళదంతతా
లువులును రక్తలోచనములుం గలభూతపిశాచఢాకినీ
నివహము లంతరిక్షమున నిల్చి నిజాయుధపాణులై మహో
రవముగ యక్షదైత్యచతురంగబలంబులఁ గూడి తోఁచినన్. 692

వ. అంత. 693

క. త్రిసవనపావనుఁ డగునా, బిసరుహనేత్రుండు లోకభీకర మగునా
యసురాధిపు మాయావి సి, రసనకరం బైనశస్త్రరాజముఁ బనుపన్. 694

క. ఆచక్రభానుదీప్తి ధ, రాచక్రమునందు నిండి రయమున నమ్మా
యాచక్రము నడఁగించెను, నీచక్రముఁ డైనయాముష్కునిచరు నెదురన్. 695

వ. అంత నక్కడ. 696

క. దితి దనవిభువాక్యంబుల, గతి దప్పద యనుచుఁ దలఁపఁగాఁ జన్నుల శో
ణితధార లొలికె రక్షః, పతి యగుకనకాక్షుపతనభావము దోఁపన్. 697

వ. అయ్యవసరంబున నసురవిభుండు దన వేసినమాయాశతంబులు కృతఘ్నునకుం
గావించినయుపకారంబులుంబోలె హరియందుఁ బని సేయక విఫలంబు లయినం
బొలివోవనిబంటుతనంబునఁ బుండరీకాక్షుఁ జేరం జనుదెంచి బాహుయుగళంబు
సాఁచి పూఁచి పొడిచి రక్షోవైరివక్షంబుఁ బీడించిన నయ్యధోక్షజుండు దప్పిం
చుకొని తలంగినం జెలంగి దైత్యుండు నిష్ఠురం బగుముష్టిం బొడిచిన నసురాంత
కుండు మిసిమింతుండు గాక రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం దెగ
టార్చినచందంబున వజ్రసన్నిభం బగునఱచేతం [1]గఱకుటసురకటితటంబుఁ
జటులగతి వ్రేసిన (నాహిరణ్యాక్షుండు దిర్రిరం దిరిగి యున్మత్తలోచనుండై సోలి
యెట్టకేలకు నెదుర నిలువంబడె నంత) 698

క. దిటచెడి లోఁబడె దైత్యుఁడు, సటికిన్ దంష్ట్రావిభిన్నశత్రుమహోర
స్తటికిన్ ఖరఖురపుటికిం, గటితటహతకమలజాండఘటికిం గిటికిన్. 699

వ. ఇట్లు లోఁబడిన. 700

---

1. గఱకు దనుజకటి.

మ. [1]దివిజేంద్రాదులు సంతసింప హరి యుగ్రత్వం గర్జమూలంబునం
బలిసంకాశకఠోరహస్తమున శుంభద్భల్లి లన్మై బడిన దా
నవలోకేశుఁ డుదస్తనేత్రుఁ డగుచున్ దైన్యంబు వాటిల్లఁగా
భువిమీఁదన్ బడెఁ గూలె మారుతహతోద్యన్మాలావనీజాకృతిన్. 701

క. బుడబుడ నెత్తురు గ్రక్కుచు, వెడరూపుసు బొల్చి గ్రుడ్లు వెలికుఱుక నిలం
బడి పండ్లు గీటుకొనుచును, విడిచెం బ్రాణములు దైత్యవీరుం డంతన్. 702

తే. పడినదనుజేశ్వరునిఁ జూచి పద్మసంభ, వాదిదివిజులు వెఱఁగంది రాత్మలందు
నితఁడు వొందుట యెట్లొకో యీయవస్థ, పరితలంచుచు మఱియు నిట్లనిరి వరుస.

మ. వరయోగీంద్రులు యోగమార్గకుల నెవ్వానిన్ మనోవీథి సు
స్థిరతన్ లింగశరీరభంగమునకై చింతింతు రాపంకజో
దరుపాణ్యాహతి నమ్మఖాంబురుహముం దర్శించుచుం జచ్చె దు
ర్భరి[2]తోత్తంసుఁడు దైత్యవల్లభుని[3] సౌభాగ్యంబు దా నెట్టిదో. 704

చ. సమమతి వీరు దైత్యకులసంభవపారిషదుల్ మునీంద్ర శా
పమున నికృష్టజన్మమునఁ బైకొని పుట్టియు నేఁడు విష్ణుచే
సమయుటఁ జేసి మీఁద నగుజన్మమునన్ జలజాక్షునిత్యవా
సమున వసింతు రెన్నఁటికిఁ జావును బుట్టువు లేవు వీరికిన్. 705

క. అని వెఱఁగందుచుఁ ద్రిదశులు, తను వొందినయట్టిపికచరతామరసాక్షు
న్ననిమిషమునియోగిజనా, వననతున్ దనుజకరటికవరహర్యక్షున్. 706

వ. కనుంగొని. 707

చ. వనజదళాక్షు యీజగతి వారలమర్మము లీ వెఱింగి యీ
సునఁ బగఁ బుట్టునీదివిజసూదనుఁ జంపితి గాన యింక శో
భన మగు నంచు హస్తములు ఫాలములం గదియించి యందఱున్
వినమితులై నుతించిరి వివేకవిశాలుని బుణ్యశీలునిన్. 708

వ. అంత. 709

చ. సవనవరాహమూర్తి సురశాత్రవుఁ ద్రుంచినమీఁద భారతీ
ధవముఖదేవతానికదంబము దన్ను నుతించునట్టిసం
స్తవమున కాత్మలోనఁ బ్రమదంబునఁ బొంది సమగ్రమంగళో
త్సవము దలిర్ప నందఱఁ బ్రసాదవిలోకన మొప్పఁ జూచుచున్. 710

చ. అరిగె వికుంఠధామమున కమ్మహితోత్సవసూచకంబు గా
మొరసె సుపర్వదుందుభులమోఘము లై ధరణీతలంబునం

1. 'దివి నింద్రాదులు సంతసింప హరి యుద్రేకం బనేకంబుగాఁ, బలిసంకాశకఠోరహస్తమున శుంభద్భల్లి లన్మై ద్రేయ దానవ'—వ్రాఁతప్రతులు. 2. తోదాత్తుఁడు. 3. యీభాగ్యంబు.

గురిసెఁ బ్రసూనవృష్టి నిఖిలాండము లెల్లడఁ జేజరిల్లె భా
స్కరశశిమండలంబులు నిజద్యుతితోఁ వెలుఁగొందె నత్తఱిన్. 711

క. అని యీపుణ్యచరిత్రము, వనరుహసంభవుఁడు శ్రీనివాసుఁడు కరుణ నె
ప్పినయట్టి మైత్రేయుఁడు విదురునకు నెఱిఁగించినవిధంబు నీకథము గానన్.

క. శుకయోగి పరీక్షిత్తున, కకుటిలమతి నెఱుఁగఁ జెప్పె నని సూతుఁడు శౌ
నకముఖ్యులైన మునివరులకుఁ దెలియఁగఁ జెప్పె వాఱియుఁ దాలన మొప్పన్.

వ. ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసిల్లె నని. 714

క. అనఘం బగునీచరితము, వినినఁ బఠించిన లభించు విష్ణుకీర్తుల్
వనజోదరుపదభక్తియు, ఘనముగొని యిహపరసుసౌఖ్యగతులు జనములకున్.

వ. అని చెప్పి వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె నట్లు పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం గనుంగొని మునీంద్రా హిరణ్యాక్షవధానంతరంబున వసుంధర సమస్థితిం బొందినవిధంబును స్వాయంభువమనువుం బుట్టించినయనంతరంబున విరించి దిర్యగ్గాతిజంతుసృష్టినిమిత్తంబు లైనమార్గంబు లెన్ని సృజించె మహాభాగవతోత్తముం డయినవిదురుండు గృష్ణున కపకారంబు దలంచినపాపవర్తను లగుధృతరాష్ట్రపుత్త్రులం బాసి జనకుం డగుకృష్ణద్వైపాయనునకు సముం డగుచుఁ దనమనోవాక్కాయకర్మంబులు గృష్ణునందు చేర్చి భాగవతజనోపాసకుం డై పుణ్యతీర్థసేవాసమాలబ్ధయశోవిగతకల్మషుం డగుచు మైత్రేయమహామునిని నేమిప్రశ్నంబు లడిగె నవి యెల్లం దెలియ నానతి య్యవలయు నని రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 716

సీ. విమలాత్ముఁ డైనయవ్విదురుండు మైత్రేయ, మునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ
జతురాత్మ సకలప్రజాపతి యైనట్టి, జలజగర్భుఁడు ప్రజాసర్గమందు
మును ప్రజాపతులను బుట్టించి వెండియుఁ, జిత్తమం దేమి సృజింపఁ దలఁచె
మును సృజించినయట్టిమును లమ్మరీచ్యాదు, లబ్జజునాదేశ మాత్మ నిలిపి

తే. యర్థి నెట్లు సృజించిరి యఖిలజగము, మెఱసి మఱివారు భార్యాసమేతు లగుచు
నేమి సృజియించి రది గాక కామినులను, బాసియేమి సృజించిరి భద్రయశులు.

క. అందఱు, దమలో నైక్యముఁ, జెందినచో నేమి దగ సృజించిరి కరుణా
కందళితహృదయ యిన్నియుఁ, బొందుగ నెఱిఁగింపు మయ్య బుధనుత నాకున్.

—— చతుర్ముఖుం డొనర్చుయక్షాదిదేవతాగణసృష్టిఁ దెలుపుట. ——

సీ. అనిన మునీంద్రుఁ డిట్లనియె జీవదృష్ట, పరుఁడు మాయాయుక్తపురుషవరుఁడుఁ
గాలాత్మకుఁడు ననుకారణంబున నిర్వి, కారుఁ డైనట్టిజగన్నివాసుఁ
డాది జాతక్షోభుఁ డయ్యె నమ్మేటివ, లనను గుణత్రయంబును జనించె
నాగుణత్రయమునం దయ్యె మహత్తత్త్వ, మది రజోగుణహేతు వైన దాని

తే. యం దహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ

బొడమె మఱి దానివలనఁ బ్రభూత మయ్యెఁ
బంచతన్మాత్ర లందు సంభవము నొందె
భూతపంచక మీసృష్టిహేతు వగుచు. 719

వ. అవియును దమలోనఁ బ్రత్యేకంబ భువననిర్మాణకర్మంబునకు సమర్థంబులు గాక యన్యోన్యసంఘాతంబునఁ బాంచభౌతికం బైనహిరణ్మయాండంబు సృజియించె నదియును జలాంతర్వర్తి యై వృద్ధిఁ బొందుచుండె నందు. 720

సీ. నారాయణాఖ్య సన్నతి నొప్పు బ్రహ్మంబు, సహస్రదివ్యవర్షంబు లోలి
వసియించి యుండె నావాసుదేవునినాభి, యందు సహస్రసూర్యప్రదీప్తిఁ
దనరుచు సకలజీవనికాయయుత మగు, పంకజాతంబు సంభవము నొందెఁ
బరఁగంగ నందులో భగవదధిష్ఠితుం, డై స్వరాట్టగుచతురాననుండు
తే. జనన మందెను దత్పద్మసంభవుండు [1]నామరూపగుణాదిసంజ్ఞాసమేతుఁ
డగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము, వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు.

సీ. తామిస్రమును నంధతామిస్రమును దమ, మును మోహనము మహామోహనంబు
ననుపంచమోహరూపాత్మక మైనయవిద్యఁ బుట్టించి యవ్వేధఁ దనకు
నది తమోమయదేహ మని మది రోసి తత్తనువు విసర్జించె ధాతృముక్త
దేహంబు సతతక్షుత్తృష్ణల కావాస, మును రాత్రిమయము నయ్యెను దలంప
తే. నందులో యక్షరక్షస్సులను జనింప, వారి కప్పుడు క్షుత్తృష్ణలవలనఁ గొంద
ఱాచతుర్ముఖు భక్షింత మనిరి కొంద, ఱతని రక్షింత మని తగనాడి రంత.

వ. ఇట్లు వలుకుచు భక్షించువార లయి ధాతసన్నిధికిం జనిన నతండు భయవిహ్వలుండై యేను మీజనకుండను మీరలు మత్పుత్త్రులరు నన్ను హింసింపకుం డనుచు మా మా జక్షత రక్షత యనుశబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్షరక్షోనామంబులు ప్రకటంబు లయ్యె వెండియుం బ్రభావిభాసితం బైనయొక్క కాయంబు ధరియించి సత్త్వగుణగరిష్ఠులుం బ్రభావంతులు నగుసుపర్వులం బ్రముఖులంగా సృజియించి తత్ప్రభామయగాత్రవిసర్జనంబు సేసిన నది యహోరూపం బై దేవతాళికి నాశ్రయం బయ్యె మఱియు జఘనంబువలన నతిలోలుపు లైనయసురలం బుట్టింప వార (లతికాముకు లగుటం జేసి య)య్యజునిం జేరి మిథునకర్మం బపేక్షించిన విరించి నగుచు నిర్లజ్జు లయినయసురులు దనవెంటం దగులం బఱచి ప్రపన్నార్తిహరుండును భక్తజనానురూపసందర్శనుండు నైననారాయణుం జేరి తత్పాదంబులకుం బ్రణమిల్లి యిట్లనియె.

క. రక్షింపుము రక్షింపుము, పేక్షింపక వినుతనిఖిలబృందారక వి
శ్వక్షేమంకర విను మిట్టు, దక్షత నీయాజ్ఞ నేను దల నిడి వరుసన్. 724

తే. ఈప్రజాసృష్టికల్పనం బే నొనర్ప, నందుఁ బాపాత్ము లైనయీయసురు లిపుడు

---

1. నామధేయాభిరూపసంజ్ఞా.

నను రమింపఁగ డాయ వచ్చినఁ గలంగి, యిటకు వచ్చితి నన్నుఁ గావు సిద్ధచరిత.

వ. అని యనుం గాక లోకంబువారలకుం గ్లేశంబు నొసరింపం గ్లేశంబునం బొందిన వారల క్లేశంబు లపనయింపను నీవ కాక (యితరులు గలరే) యని స్తుతియించినఁ బద్మజు కార్పణ్యం బెఱుంగ నవధరించి విధి కాత్మఘోరతనువు విడువుమనఁగ నతఁడు భవదాజ్ఞ తనుత్యాగంబు సేయుదునని యానతిచ్చిన నతండు నట్ల చేసె నంత నదియును. 726

సీ. సవ్యకాంచనరణన్మణినూపురారావ, విలసితపాదారవిందయుగళ
కాంచీకలాపసంకలితదుకూలవ, ద్విస్ఫారపులినసన్నితంబబింబ
రాజితాన్యోన్యసక్తరుచిరపీనకుచకుంభ, పృథుకుచభారకంపితవలగ్న
మధురాధరస్వాదమదవిఘూర్ణితచారు, సితనవవికచరాజీవనయన

తే. యుపరవక్త్రోష్ఠవిమలశశాంకకాంతి నిటల, షట్పదాలికులకుటిలోపమానచికుర
లలితచంపకకుసుమవిలాసనాస, హాసలీలావలోకన యబ్జపాణి. 727

క. అనఁ దగి సంధ్యారూపం, బున లలనారత్న మగుచుఁ బుట్టిన దానిం
గనుఁగొని దానవు లుగ్రా, హ్వాన మొగిం గావించి పలికి రందఱుఁ దమలోన్.

క. ఈ సౌకుమార్య మీవయ, సీ సౌందర్యక్రమంబు నీ స్థైర్యంబు
న్నీ[1] సౌభాగ్యవిశేషము, నేసతులకుఁ గలదు చూడ నిది చిత్ర మగున్. 729

చ. అని వెఱఁగంది యద్దనుజు లందఱు నిట్లని కీతలోదరిం
గని మన మంతనుండియును గాముకవృత్తిఁ జరించుచుండఁగా
మనయెడ డించి తమున మక్కువ లేమికి నేమిహేతువో
యని బహుభంగులం బలికి రా ప్రమదాకృతి యైనసంధ్యతోన్. 730

వ. ఇట్లనిరి. 731

క. ఓ కదళీస్తంభోరువ, యేకల మేజాడ దాన వెవ్వరిసుత వి
శ్లోకాంతంబున నిచ్చట, నేకారణమునఁ జరించె దెఱిఁగింపు తగన్. 732

క. భవదీయచారురూప, ద్రవిణలసత్పుణ్యభూమిఁ దగు మోహమునం
దవిలిన దుర్భరులను మముఁ, గవయవు పుష్పాస్త్రబాధ ఘన మయ్యెఁ గదే.

వ. [2]అని యంత. 734

సీ. గురుకుచభారసంకుచితావలగ్నంబు, దనరారు నాకాశతలము గాఁగ
లలితపల్లవపాణితలమునఁ జెన్నొందు, చెండు పతత్పతంగుండు గాఁగ
సలలితనీలకేశలసత్పృథుధమ్మిల్ల, బంధంబు ఘనతమఃపటలి గాఁగఁ
బ్రవిమలతరకాంతభావవిలోకన, జాలంబు దారకాసమితి గాఁగఁ

తే. గడఁగి మైపూఁత సాంధ్యరాగంబు గాఁగ
నంగనాకృతి నొప్పుసంధ్యావధూటిఁ

1. సొబగు నీవిశేషము. 2. మఱియుఁ దదీయసౌందర్యంబుగ్గడింప నలవిగాక చింతించుచు,

గదిసి మనముల మోహంబు § గడలుకొనఁగ
నసురు లందఱుఁ గూడి యు § ట్లనిరి మఱియు. 735

క. తెలియఁగఁ బద్మం బేక,స్థలము ననే యొప్పఁ గాని § త్వత్పదపద్మం
బిల బహుగతుల ననేక,స్థలములఁ దనరారఁ గాదె § తరుణాబ్జముఖీ. 736

క. అని దనుజులు దమమనముల, ననురాగము లుప్పతిల్ల § నందఱు నాసం
ధ్యను బట్టికొనిరి వనజా,సనుఁ డప్పుడు హృదయమందు § సంతస మందెన్. 737

క. సరసిజభవుఁ డమ్మెయిఁ దన, కర మాఘ్రాణింప నప్పుడు § గంధర్వులు న
ప్సరసలుఁ బుట్టిరి ధాతయుఁ, బరువడి నాత్మీయతనువుఁ § బాసిన నదియున్. 738

వ. చంద్రికారూపం బైనం దద్గాత్రంబు (విశ్వావసుపురోగము లగు) గంధర్వాప్సరోగణంబులు గైకొనిరి వెండియుం గమలగర్భుండు తంద్రోన్మాదజృంభికానిద్రారూపం బైనశరీరంబు దాల్చి పిశాచగుహ్యకసిద్ధభూతగణంబులం బుట్టించిన వారలు దిగంబరులు ముక్తకేశులు నయినం జూచి ధాతలోచనంబులు ముకుళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గైకొనిరి వెండియు నజుండు దన్ను నన్నవంతునిఁ గాఁ జింతించి యదృశ్యదేహుం డగుచుం బితృసాధ్యగణంబులం బుట్టించిన వారలు దమ్ముఁ బుట్టించినయదృశ్యశరీరంబునకుం గార్యం బగుదేవభాగంబుఁ గైకొనినం దత్కారణంబునం బితృసాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల హవ్యకవ్యంబు లాచరింతురు మఱియును. 739

సీ. సజ్జనస్తుత ఘను § చతురతఁ బంకజా,సనుఁడు దిరోధానశక్తివలన
నరసిద్ధవిబుధకి§న్నరులను బుట్టించి, తవిలి వారికిఁ దిరో§ధాననామ
ధేయ మైనట్టియాత్మ§దేహంబు నిచ్చెను, వెండియు భారతీ§విభుఁడు దనకుఁ
బ్రతిబింబ మగుశరీ§రమునఁ గిన్నరులఁ గిం,పురుషులఁ బుట్టింపఁ బూని వారు

తే. ధాతృ ప్రతిబింబదేహముల్ § దాల్చి వరుస,నిద్దఱిద్దఱు గవగూడి § యుండ్లలోదవ
బ్రహ్మపర మైనగీతముల్ § పాడుచుండి. రంతఁ బంకజసంభవుఁ § డాత్మలోన.

క. తనసృష్టి వృద్ధి లేమికి, గనలుచు శయనించి యంతఁ § గరచరణాదుల్
గానకొని కదలింపఁగ రా,లినరోమము లుగ్రకుండలిప్రజ మయ్యెన్. 741

క. వనజజుఁడు దనునుఁ గృతకృ,త్యునిఁ గా భావించి యాత్మఁ § దుష్టి వహింపన్
మనమున నిఖిలజగత్పా,వను లగు[1] మనులం ద్రిలోక§వరుల సృజించెన్. 742

సీ. పుట్టించి వారికిఁ § బురుషరూపం బైన, తనదేహ మిచ్చినఁ § దగిలివారు
గనుఁగొని మున్ను పు§ట్టినవారిఁ గూడి యా,వనజసంభవునకు § ట్లనిరి దేవ
యఖిలజగత్సృష్టి § యైననీచేతఁ గా,వింపఁగఁబడిన యా§వితతసుకృత
[2]మాశ్చర్యకరము యజ్ఞాదిక్రియాకాండ, మీమనుసర్గ మం § దీడ్య మయ్యెఁ

1. బ్రహ్మణ్యముఖ్యవరుల. 2. మాశ్చర్యకర మయినందు యజ్ఞాదిక్రియాకాండ మిది నిశ్చయంబు నొందె.

సలలితదరహాసవిచంద్రికాధవళిత, చారుదర్పణవిరాజితకపోలుఁ

తే. శంఖచక్రగదాపద్మ చారుహస్తు, నలికులాలకరుచిభాస్వదలికఫలకుఁ
పీతకౌశేయవాసుఁ గృపాతరంగి, తస్మితేక్షణుఁ బంకజోదరుని హరిని. 751

వ. మఱియు శబ్దబ్రహ్మశరీరవంతుండును సదాత్మకుండును జ్ఞానైక వేద్యుండును వైన తార్క్ష్యాంసవిన్యస్తచరణారవిందుండు నయినగోవిందునిఁ గనుంగొని సంజాత హర్షలహరీపరవశుండును లబ్ధమనోరథుండును నగుచు సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి తదనంతరంబ. 752

క. ముకుళితకరకమలుం డయి, యకుటిలసద్భక్తిపరవశాత్మకుఁ డగుచున్
వికచాంభోరుహలోచను, నకు నిట్లనియెం దదాననముఁ గనుఁగొనుచున్. 753

సీ. అబ్జాక్ష సకలభూతాంతరాత్ముఁడ వగుఁ, దసరు చుండెడిభవద్దర్శనంబుఁ
దలకొని సుకృతసత్ఫలభరితంబు లై, నట్టియనేకజన్మానుసరణిఁ
బ్రకటయోగక్రియాభ్యాసనిరూఢు లై, నట్టియోగీశ్వరు లాత్మ నిచ్ఛ
యింతురు యోగీశ్వరేశ్వర యే భవ, త్పాదారవిందసందర్శనంబు

తే. గంటి భవవార్ధిఁ గడవంగఁ గంటి మంటిఁ, గడఁగి నాలోచనంబులకలిమి నేఁడు
తఱలి సఫలత నొందె మాధవ ముకుంద, చిరదయాకార నిత్యలక్ష్మీవిహార.

వ. అదియునుం గాక దేవా భవదీయమాయావిమోహితు లై హతమేధస్కు లై సంసారపారావారోత్తారకంబు లైనభవదీయపాదారవిందంబులు దుచ్ఛవృత్తి కాము లయి సేవించి నిరయగతు లైనవారికిం దత్కామయోగ్యంబు లగు మనోరథంబుల నిత్తు వట్టిసకాము లైనవారి నిందించునేనును (గృహమేధధేనువు నశేషమూలయుం) ద్రివర్గకారణయు సమానశీలయు నయినభార్యం బరిణయంబుగా నపేక్షించి కల్పతరుమూల (సదృశ)ంబు లైనభవదీయపాదారవిందంబులు సేవించితి నయిన నొక్కవిశేషంబు గలదు విన్నవించెద నవధరింపుము బ్రహ్మాత్మకుండ వయినభవద్వచస్తంత్రీనిబద్ధు లై లోకులు కామహతు లైరంట యేనును వారల ననుసరించినవాఁడ నై కాలాత్మకుండ వైననీకు నభిమతం బగునట్లుగాఁ గర్మమయం బైనభవదాజ్ఞాచక్రంబు ననుసరించుటకుఁ గాని మదీయకామంబు కొఱకుఁ గాదు భవదీయమాయావినిర్మితంబును ([1]గాలాత్మకభూరివేగసమాయుక్తంబును నక్షరంబును నైనబ్రహ్మంబునందు భ్రమణశీలంబును) నధిమాససమేతత్రయోదశమాసారంబును షష్ట్యుత్తరశతత్రయాహోరాత్రమయపర్వంబును ఋతుషట్కసమాకలితనేమియుం జాతుర్మాస్యత్రయవిరాజితనాభియు నపరమితక్షణలవాదిపరికల్పితపత్త్రశోభితంబునుం గాలాత్మకభూరివేగసమాయుక్తంబును నైనకాలచక్రంబు సకలజీవనికరాయుర్గ్రసనతత్పరం బగుంగాని కామాభిభూతజనానుగతపశుప్రాయు లగులోకుల విడిచి భవపరితాపనివారణకారణం బయిన

1. 'బ్రహ్మాత్మకంబును' అని వ్రాఁతప్రతులు.

క్తప్రకారంబున వివాహంబు సేసెను. తదనంతరంబ శతరూపయును బారిబర్హ సంజ్ఞకంబులైన వివాహోచితదివ్యాంబరాభరణంబులు దేవహూతికర్దముల కొసంగి నిర్విఘ్నంబున నిజకులాచారసరణిం బరిణయంబు గావించి విగతచింతాభరుం డై స్వాయంభువుం డనుమహీపతి వియోగవ్యాకులితచిత్తుం డగుచుం గూతుం గౌఁగిలించుకొని చుబుకంబుఁ బుడుకుచుఁ జెక్కిలి మూర్కొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్తమస్తకం జేసి తల్లీ పోయివచ్చెద నని చెప్పి కర్దము నిచేత నామంత్రితుం డై నిజభార్యాసమేతుం డై రథం బెక్కి సపరివారుం డై.

చ. తరళతరంగవీచిసముదంచితబిందుసరస్సరస్వతీ
సరిదరవిందతుందిలలసత్తరుశీకరనివాససన్మునీ
శ్వరనికరాశ్రమాకలితసంపదలం గనుఁగొంచు వేడ్క ము
ప్పిరిగొన నేఁగె నాత్మపురభేదనవిస్ఫుటమార్గవర్తియై. 794

వ. ఇట్లు సనిచని బ్రహ్మావర్తదేశంబునందు. 795

సీ. ఎందేనిఁ దొల్లి లక్ష్మీశుండు యజ్ఞసూ,కరమూర్తి యై కొని సరభసమున
నొడలు జాడించినఁ బుడమిపై రాలిన,రోమజాలంబులు రుచిరహరిత
వర్ణ మై పొలుపారు వరకశకాశమ,యంబును యజ్ఞక్రియాకలాప
యోగ్యంబు నై చాల నొప్పారి బర్హిస్సు, సంభవించిన దాన సకలఋషులుఁ

తే. క్రతువు లొనరించి తద్విఘ్నకారు లైన, యసురులను ద్రుంచి రట్లు స్వాయంభువుండు
విష్ణుపరముగ మఖముఁ గావించి రుచిర, మేధఁ జెలువొందె నట్టియాత్మీయపురము.

క. డాయం జనఁ బురజనము లు,పాయనములు దెచ్చియిచ్చి బహుగతుల నుతుల్
సేయంగ మంగళతూర్యము, లాయతగతి మొరయఁ జొచ్చె నంతఃపురమున్.

వ. ఇట్లు ప్రవేశించి తాపత్రయోపశామకం బగు భగవద్భక్తి వృద్ధిఁ బొందించుచుఁ బుత్త్రమిత్త్రకళత్త్రసుహృద్బాంధవసహితుం డై పరమానందంబున. 798

మ. అతిభక్తిం బ్రతివాసరంబును హరివ్యాసంగుఁ డై మాధవాం
కితగంధర్వవిపంచికాకలితసంగీతప్రబంధానుమో
దితుఁ డై యిష్టవిభూతులందు ననురక్తిం జెంద కేప్రొద్దున
చ్యుతసేవైకపరాయణుం డగుచు నస్తోకప్రభావోన్నతిన్. 799

మ. హరిపాదాంబురుహద్వయార్పితతులస్యామోదముం గొంచుఁ ద
చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచుం జర్చించుచుఁ జూచుఁ ద
త్పరిచర్యావ్యతిరిక్తసంసరణసద్ధర్మార్థకామంబులం
బరిభూతంబులఁ జేసి మోక్షపదసంప్రాప్తిక్రియారంభుఁ డై. 800

క. నిగమార్థగోచరుం డనఁ, దగు హరిచరితప్రసంగతత్పరచిత్తుం
డగు నతనికి [1]మన్వంతర, మగుయామము లొగి నయాతయామము లయ్యెన్.

1 'స్వాంతరగము' లగుయామము.

తే. ఇత్తెఱఁగ భగవత్ప్రసాదంబున నీ కఖిలముం గల్గెఁ, గాకరంబున నగునె కామ్యలాభయమునఁ
జనిత క్రూరకృతజంతువిహారాశ్రమములకు, నాశ్రమఫలసిద్ధి సేయుదానఁ గాని సేవ. 816

క. కజ్జలముల నతిభక్తిని మజ్జన మొనరించి యావిమానము వేడ్కన్
లజ్జావతి యెక్కెద నని, బుజ్జగనఁ దగఁగఁ దోఁపఁ గర్దముఁడు పలుకుటయున్.

వ. అని మూకుళితకరాంబుజయై పతిసేవాయాసమలినాంబరయును వేణీభూతశిరోజయు ధూ
ళిధూసరి¹తాత్మశరీరభూషితాంగయు శబలస్తనయు నై భర్తృనియోగంబున సర
స్వతీసలిలసంభూతజలచరాశ్రయం బగు బిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలం
బులఁ గ్రుంకు లిడునవసరంబునఁ దద్వారిపూరమధ్యంబున ²రుచిరసూక్ష్మాంశుక
ధారిణులుఁ గిశోరవయఃపరిపాకశోభితలు నుత్పలగంధులు నగుకన్యాసహస్రం
బులు దేవహూతిం గనుంగొని యిట్లనిరి. 818

క. తరుణీ సంచితకర్మాచరణల మగుమేము నీకు సదమలభక్తిం
బరిచర్య సేయ నేర్తుము, కరుణాకలితేక్షణములఁ గనుఁగొను మమ్మున్. 819

సీ. అని పల్కి దాసి యయ్యతివకు నభ్యంజనోద్వర్తనములు పెంపు పొనరఁ జేసి
మలయజకర్పూరమహితవాసితహేమకలశోదకంబుల జలక మార్చి
ధవళవస్త్రంబులఁ దడియార్చి సర్వాంగభూషణంబు లొసఁగి కస్తూరి యలఁది
మంజులశింజన్మణిమంజీరకంకిణీ, కలరవాకలితమేఖలలు ³పూన్చి

తే. కనకతాటంకముద్రికాకంకణాది, సముచితానర్ఘహేమభూషణము లొసఁగి
భవ్యమాల్యానులేపనాంబరము లిచ్చి, మద్రసోపేతవివిధాన్నసమితిఁ దనిపి.

వ. మఱియుం గనకపాత్రరచితంబు లయినకర్పూరనీరాజనంబుల నివాళించి రుచిరాస
నంబునఁ గూర్చుండఁ బెట్టి దర్పణంబు సేతి కిచ్చినం దత్ప్రతిఫలితనిజదేహంబు
గనుంగొని కర్దముని మనంబునం దలంచిన నతండును గన్యకాసహస్రంబును
దత్క్షణంబునఁ దనసన్నిధి నుండుటం జూచి నిజభర్తృయోగమాయాప్రభావంబు
నకు నద్భుతంబు నొందె నంతఁ గర్దముండును గృతస్నాన యైనదేవహూతిం
గనుంగొని వివాహంబునకు మున్నట నేచందంబునం దనకు నుండె నాచందం
బునం జెన్నొందుచుండుటకు నానందభరితుం డై భార్యాసహితంబుగఁ
దత్కన్యకాసహస్రంబు గొలువ నిజవిమానారూఢుం డై తారాగణపరివృత
రోహిణీయుక్తుం డగుసుధాకరుండునుబోలె నొప్పుచుం దదనంతరంబ. 821

చ. చిరశుభమూర్తి యమ్ముని యశేషదిగీశవిహారయోగ్యముల్
సురుచిరమందగంధవహశోభితముల్ నికటప్రధాతుని
ర్ఝరసదంబుశీతలతుషారము నై తనరారు మేరుకం
దరమున కేఁగి దేవవనితాయుతుఁ డై నకుబేరుచాడ్పునన్. 822

1 'శకుచసమేతయు నై'. 2 'రుచిరమందిరావాసులు'. 3 'రత్నఖచితతాటంక' ప్రా. ప్ర.

వ. మఱియును. 823

మ. అమరోద్యానవనప్రదేశములయం దస్వారామభూముల్ దశ
త్కుముదాంభోజవిభాసిమానససరస్తీరాలంబులున్ మంజుకుం
జకులంబై చైత్రరథంబు విస్ఫురితవిస్రంభంబునం జూచె నె
య్యమునం గర్దమయోగి గామవిమానారూఢుఁడై చెచ్చెరన్. 824

వ. ఇవ్విధంబున సమస్తభూభాగంబులను వాయువేగంబున గలయం గ్రుమ్మరి నిఖిల వైమానికలోకంబు నతిశయించి (లోకంబులం జరించె) మోక్షదాయకుండును దీర్ఘపాదుండు నగు పుండరీకాక్షుని సన్నుతించి సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థంబులు గలవే యిట్లు కర్దముండు దేవహూతికి నిఖిలధరాచక్రం బంతయుం జూపి మరల నిజనివాసంబునకుం జనుదెంచి కామకేళీవినోదాత్మకయై యున్న భార్య నుపలక్షించి రతిప్రసంగవ్యాసంగంబు గైకొని బహువిధంబు లయిన యిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్కముహూర్తంబుగా జరుపుచు నన్యోన్యసరసావలోకనంబుల సముచితాలింగనసంభాషణంబులం గాలక్షేపణంబు సేయ నేరక శతవత్సరంబులు గడపి తదనంతరంబ. 825

క. మునివరుఁ డొకనాఁ డిమ్ములఁ, దననిజదేహంబు నవవిధంబులు గావిం
చి నయంబునఁ దద్వీర్యముఁ, దనసతిగర్భమున నవవిధంబుగ నిలిపెన్. 826

క. అది కారణంబు గాఁ బెం, పొదవినముని వలన [1] దేవహూతియుఁ గూఁతుల్
ముదమునఁ గనెఁ దొమ్మండ్రన్, ముదితయు నది సంతసించె మునివరుఁ డంతన్

తే. సన్న్యసింపంగఁ గోరుట సతి యెఱింగి, యాత్మఁ బొడమిన సంతాప మగ్గలింపఁ
జింత వాటిల్లఁ జెక్కిటఁ జేయి సేర్చి, పదమునను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి.

సీ. అనఘ సంతానపర్యంతంబు నను గూడి, వర్తింతు ననుచుఁ బూర్వమునఁ బలికి
కూఁతుల నిచ్చితి కోమ రార నిప్పుడీ, తరుణులు పతులను దమకుఁ దార
యరసి వర్తింతురో యని భీతి నొందెదఁ, గావున నీపుత్రికలకుఁ దగిన
వరుల సంపాదించి పరిణయంబులు సేసి, తత్త్వసంహిత నాకుఁ దవిలి తెలుపు

తే. సుతునిఁ గృప సేసి ననుఁ గావు సుజనవినుత, దుర్ధిసంసారదుఃఖంబు నపనయింప
నర్హుఁడవు నీవ కావె మోహమున నింత, కాల మూరకపోయె నేగతియు లేక.

చ. [2] ఉపరతి వుట్టె నైహికసుఖోపగతానుభవంబులందు మున్
చపలతఁ గామభోగరతిసంగముఁ గోరి మహాత్మ నిన్ను న
చ్చపుఁదలఁ బొప్పఁగాఁ దెలియఁ జాలకయున్ వరియించుటన్ భవ
త్కృప ఫలియించె ముక్తి నినుఁ గేవలభక్తి భజింపఁ గల్గదే. 830

వ. అదియునుం గాక. 831

---

1. 'దేవహూతికిఁ గూఁతు, లుదయించిరి తొమ్మండ్ర, మ్ముదితయు' వ్రా. ప్ర. 2. 'అపరతి వుట్టె నీయిహసుఖానుభవంబులయందు మున్ను నేఁ జపలత' వ్రా. ప్ర.

నవియ పో జన్మకర్మాయుర్మనోవచ,సములను ధరణి నెన్నంగఁ దగును
వనరుహనాభసేవారహితము లైన,జననోపనయనదీక్షాకృతంబు
తే. లైనజన్మంబు లేల దీర్ఘాయు వేల, వేదచోదిత యాగకర్మవితతి యేల
జపతపశ్శ్రుతవాగ్విలాసంబు లేల, మహితనానావధానసామర్థ్య మేల. 952

వ. మఱియు హరివిరహితం బైన యింద్రియపాటవంబును నిపుణ యైనబుద్ధియుఁ బ్రాణాయామాదియోగంబును దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానంబును సన్న్యాసాధ్యయనంబులును పక్కిన వ్రతవైరాగ్యాదిశ్రేయస్సాధనంబులును నేల సర్వేశ్వరుండును సమస్తశ్రేయస్స్వరూపుండును సమస్తశ్రేయోవధిభూతుండును సర్వభూతావాసుండును సర్వభూతాత్మప్రదుండును సర్వభూతప్రియుండును (సర్వవ్యాపకుండునుం) గావున. 953

మ. కమలాధీశ్వరుఁ బూజ సేయుట సమగ్రప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియతృప్తిహేతువగు సర్వాత్మజమూలాభిషే
కము శాఖాభుజపుష్టిదంబు నగురేఖన్ సర్వదేవార్హణ
క్రమ మై యొప్పు ధరావరేణ్యసుతులారా బుద్ధి నూహించినన్. 954

వ. అదియునుం గాక. 955

క. పెను పగువర్షాకాలం,బున దిననాయకునివలనఁ బొడమినసలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం,బున సూర్యునియందుఁ జెందుపోలిక మఱియున్

క. ధరణిఁ జరాచరభూతము, లరయఁగ జనియించి యందె యడఁగినపగిదిన్
హరిచేఁ బుట్టినవిశ్వము, హరియందె లయంబు నొందు నదియెట్లన్నన్. 957

మ. [1]అరు దౌనభ్రితమఃప్రభల్ మును నభంబం దొప్పఁగాఁ దోఁచి క్ర
మ్మఱ నీక్షింపఁగ నందె లేనిగతి బ్రహ్మంబందు నీ శక్తులుం
బరికింపం ద్రిగుణప్రవాహము సముత్పన్నంబు లై క్రమ్మఱన్
విరతిం బొందుచు నుండుఁ గావున హరిన్ విష్ణున్ భజింపం దగున్. 958

వ. మఱియును సమస్తదేహులకు నాత్మయు (నిమిత్తభూతుండును) నద్వితీయుండును శశ్వత్ప్రకాశుండును ప్రధానపురుషుండును స్వతేజోవిధ్వస్తగుణప్రవాహుండును (మానసబుద్ధిసుఖేచ్ఛాద్వేషాదివికల్పరహితుండును సగుణుండును దేహాత్మభ్రమనివృత్త్యుపలభ్యుండును నాదిమధ్యాంతరహితుండును నిత్యానందస్వరూపుండును సర్వజ్ఞుండు:) బరమేశ్వరుండును నైననారాయణు నభేదబుద్ధిం జేసి భజింపుఁడు తండు సర్వభూతదయయు నెంతమాత్రంబు సంభవించు నంత మాత్రంబున సంతుష్టుం డగుటయును సర్వేంద్రియోపశాంతియు ననునీగుణంబులు గలిగినయెడ సంతుష్టుం డగు నని వెండియు నిట్లనియె. 959

చ. చతురత నట్టియీశ్వరుఁడు సజ్జనలోకనిరస్తసర్వకా

---

1. అరయ న్నభ్రతమఃప్రకాశల నభం.

క. మునినాథచంద్ర కరుణా,వననిధి నీచేత భక్తవత్సలుఁ డగునా
వనజాక్షుతత్త్వ మెఱిఁగితి, నని తత్పదములకు వినతుం డై వినయమునన్. 970

క. ఆమునిచే నామంత్రితుఁ, డై మనమున బంధుదర్శనాకాంక్షితుఁ డై
ధీమహితుం డైన విదురుఁడు, సామజపురమునకు జనియె సమ్మద మొప్పన్.

క. అని శుకుఁడు పరీక్షిత్తున, కనుకంపం జెప్పె నీయుదాఖ్యానంబున్
వినువాఁ డైశ్వర్యాయుర్ధ,నకీర్తిస్వస్తిగతులఁ దగఁ బ్రాపించున్. 972

క. అని శుకయోగి పరీక్షి,జ్జనపాలసుధాపయోధిచంద్రున కర్థిన్
వినిపించినకథ మోదం,బున సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పెన్. 973

చ. సరసవచోవిలాసగుణసాగర సాగరమేఖలామహీ
భరణధురంధర ప్రకటభవ్యభుజాభుజగేంద్ర రాజశే
ఖర ఖరదూషణప్రముఖగాఢతమఃపటల ప్రచండభా
స్కర కఠకంఠకార్ముకవిఖండన ఖేలన భక్తపాలనా. 974

క. శరవిదళితసారంగా, సరసదయాపాంగ భక్తజలధితరంగా
దురితధ్వాంతపతంగా, వరజనకసుతాభిషంగ వననిధిభంగా. 975

మాలిని. సురవిమతవిదారీ సుందరీశంబరారీ, సరసవినుతసూరీ సర్వలోకోపకారీ
నిరుపమగుణహారీ నిర్మలానందకారీ, గురుసమరవిహారీ ఘోరదైత్యప్రహారీ.

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్త్రసహజపాం
డిత్య పోతనామాత్యప్రణీతం బయిన శ్రీమహాభాగవతం బనుమహాపురాణంబు
నందు స్వాయంభువమనువునకు నాకూతిదేవహూతిప్రసూతి ప్రియవ్రతోత్తాన
పాదులు జన్మించుటయు నందు నాకూతిని రుచిప్రజాపతికి నిచ్చుటయు నారుచి
ప్రజాపతికి నాకూతిదేవియందు శ్రీవిష్ణుమూర్త్యంశజుం డైనయజ్ఞుండును లక్ష్మీ
కళాంశజ యగుదక్షిణ యనుకన్యకయు నుద్భవించుటయు మనుపుత్త్రి యైనదేవ
హూతిని గర్దమున కిచ్చుటయుఁ బ్రసూతిం దక్షప్రజాపతి కిచ్చుటయుఁ బ్రసూతి
దక్షులవలనం బ్రజాపరంపరలు గలుగుటయు మఱియుం గర్దమప్రజాపతి
పుత్త్రికాసముదయంబును క్షత్త్రబ్రహ్మర్షుల కిచ్చుటయుఁ గర్దమపుత్త్రి యైనకళ
వలన మరీచికిఁ గశ్యపుం డనుపుత్త్రుండును బూర్ణిమ యనుకూఁతురుం బుట్టు
టయును బూర్ణిమవలన గంగయు విరజుం డనెడుకుమారుండును జన్మించుట
యుఁ గశ్యపప్రజాపతివలన నయినప్రజాపరంపరలచే ముల్లోకంబు లాపూర్ణం
బు లగుటయు నత్రిమహామునితపంబును నతనికి హరిహరబ్రహ్మలు ప్రత్యక్షం
బగుటయు ననసూయాపాతివ్రత్యమాహాత్మ్యంబువలన ననసూయాత్రులకుం
ద్రిమూర్తులకళాంశజు లయినచంద్రదత్తాత్రేయదుర్వాసులజన్మంబును దక్షా
త్మజలజన్మంబును భృగువువలనఖ్యాతి యనునంగనకు శ్రీమహాలక్ష్మి జన్మించు
టయును భృగుపౌత్త్రుం డయినమార్కండేయుజన్మంబును ధర్మునకు మూర్తివల

న నరనారాయణులు సంభవించుటయును సత్త్రయాగంబునందు దక్షుండు శివుని నిందించుటయును దక్షాధ్వరధ్వంసంబున బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుండు దక్షాదుల ననుగ్రహించుటయును దక్షాదికృత శ్రీహరి స్తవంబును శ్రీహరి ప్రసన్నుండై దక్షుని యజ్ఞంబు సఫలంబుగా ననుగ్రహించుటయును సతీదేవి హిమవంతునకు జనించి హరునకుం బ్రాప్తించుటయు నుత్తానపాదుని వృత్తాంతంబును ధ్రువోపాఖ్యానంబును ధ్రువుండు దండ్రిచేత నవమానితుండై నారదోపదేశంబున మధువనంబునకుం జని తపంబు సేయుటయు హరి ప్రసన్నుండై యతని మనోరథంబు లిచ్చుటయు నతండు పురంబునకు వచ్చుటయుఁ గుబేరానుచరులైన యక్షులతోడి యుద్ధంబును ధ్రువుండు యజ్ఞంబులు సేయుచు రాజ్యభోగంబులం దనిసి తనయు నుత్కలునిం బట్టంబు గట్టి హరియనుగ్రహంబున ధ్రువక్షితిని నిలుచుటయు నుత్కలుండు వత్సరుం డను తనసుతునిఁ బట్టంబు గట్టి హరిం జేరుటయు వత్సరుని వంశపరంపరయు నందు నంగుని సుతుండయిన వేనుకళేబరంబున లక్ష్మీనారాయణుల యంశంబున నర్చియుఁ బృథుండును జన్మించుటయుఁ బృథుండు భూమిం గామధేనువు రీతి నఖిలవస్తువులుం బిదుక నియమించి సమస్థలిం జేసి యింద్రుండు వశవర్తియై యుండ బహుయజ్ఞంబులు సేసిన నతనికి హరి ప్రత్యక్షం బగుటయు నధ్యాత్మప్రబోధంబును నింద్రుని వలనఁ బాషండసంభవంబును నింద్రుని జయించిన విజితాశ్వుని నతని తమ్ములను బృథివీపాలనంబునకు నిలిపి పృథుండు నర్చియుం బరమపదప్రాప్తు లగుటయు వసిష్ఠుశాపంబునఁ ద్రేతాగ్నులు విజితాశ్వునికిం దనయులై జనించుటయుఁ బృథుని పౌత్త్రుండయిన ప్రాచీనబర్హి రాజ్యంబును నానాయజ్ఞంబు లసంఖ్యాతంబులైన నారదుండు మాన్పం దలంచి పురంజనుకథ నధ్యాత్మప్రపంచంబుగాఁ దెలుపుటయుఁ బ్రాచీనబర్హి సుతులయిన ప్రచేతసులు పదువురకు శ్రీమహాదేవుండు ప్రత్యక్షంబై హరిస్తవం బుపదేశించుటయుఁ బ్రచేతసుల తపంబునకు మెచ్చి హరి ప్రత్యక్షం బగుటయు వారికి మారిషవలన దక్షుండు పూర్వకాలంబున శివవిద్వేషప్రయుక్త శాపంబునం బుత్త్రుండై జనియించుటయును బ్రచేతసులు ముక్తికిం జనుటయును విదురుండు మైత్రేయుని వీడ్కొని హస్తిపురంబున కరుగుటయు ననుకథలు గల చతుర్థస్కంధము. 977

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు,

